ubuntu

# ఉబుంటు

# వాడుకరి మార్గదర్శని

*తెలుగులో ప్రారంభం నుండి ముగింపు దాక*



సంకలనం: అర్జునరావు చెవల




*ప్రత్యక్ష అనుభవ తెర(LiveDVD Screen)*




*స్థాపన ఎంపిక తరువాత స్వాగతం తెర*

# ఉబుంటు

# వాడుకరి మార్గదర్శని

*తెలుగులో ప్రారంభం నుండి ముగింపు దాక*

## సంకలనం: అర్జునరావు చెవల

**రూపాంతరం(సాధారణ మరియు ఇ-పుస్తకం):1 విడుదల:** మే 2011



**ఇతర గుర్తింపులు:**

వికీబుక్స్‌లోని మూలాలపై ఆధారపడినది. మూల వ్యాసాలు, రచయితల వివరాలకు http://te.wikibooks.org/wiki/ **ఉబుంటు_వాడుకరి_మార్గదర్శని** చూడండి

# విషయసూచిక


పరిచయం....1

ఉబుంటు చరిత్ర....4

స్థాపన....7

రంగస్థలం....16

తెలుగు టైపు చేయుటం....23

వెబ్ వీక్షణం....28

ఈ-ఉత్తరాలు మరియు ఛాట్....30

చలనచిత్రాలు....34

సంగీతం....36

ఫోటోలు....39

ముద్రణ....41

సాధారణ ఉత్తరాలు, లావాదేవీ పత్రాలు, నివేదికలు....42

ఆర్థిక మరియు ఇతర లెక్కలు....45

ప్రజంటేషన్లు....47

ఆటలు....49

తరచూ అడిగే ప్రశ్నలు....50

కంప్యూటర్ పదకోశం....51

# పుస్తకం నేపథ్యం మరియు ధన్యవాదాలు

తెలుగు వాడుకరులకు తెలుగులో కంప్యూటర్ వాడుకునే సౌలభ్యం అందుబాటులోకి వచ్చినతరువాత సరియైన పుస్తకాలు వెలువడలేదు. సమాచారం కొరకు ఔత్సాహికులు మిత్రులపై లేక అంతర్జాలంలో వున్న బ్లాగుల పై ఆధారపడవలసివచ్చేది.

ఉబుంటు ని తెలుగులోనే వివరించగలిగితే చాలామంది కంప్యూటర్ నేర్చుకోవటం వాడటం వీలవుతుందని భావిస్తూ ఈపుస్తకం తయారు చేయబడింది. దీని మూలపు పాఠ్యాలు వికీబుక్స్ లో రాయబడినవి. ఆ తరువాత ముద్రణ/ఎగుమతి విస్తరణ వాడి బహిరంగ పాఠ్యపత్ర(ఒడిటి )ఆకృతికి మార్చబడినవి. చిత్రాలు ఉబుంటులో వుండే అనువర్తనము లేక ఇతర కెమేరాతో తీయబడినవాటిని కంప్యూటర్ లో షాట్వెల్, గింప్ ఉపయోగించి మార్చడం జరిగింది. చివరకు వాటినన్నిటిని లిబ్రెఆఫిస్ లో పిడిఎఫ్ ఎగుమతితో ఎలెక్ట్రానిక్ పుస్తకం చేయడం జరిగింది. వీటన్నిటికి పూర్తిగా స్వేచ్ఛా బహిరంగ మూలాల సాఫ్ట్వేర్, ఖతులు వాడిచేయబడినది. లోహిత్ తెలుగు ఖతి వాడబడినది.

దాదాపు పది సంవత్సరాలు లినక్స్ కొరకు తెలుగు స్థానికీకరణలో కృషిచేసిన వారందరికి ధన్యవాదాలు . తెలుగు ప్రజలందరు కంప్యూటర్ తెలుగులో వాడాలని కోరుకుంటూ..

బెంగుళూరు

5 మే 2011

అర్జునరావు చెవల

ఉబుంటు తెలుగు స్థానికీకరణ సమన్వయకారుడు

ఈమెయిల్: arjunaraoc@googlemail.com

# పరిచయం

ఉబుంటు అన్నది లినక్స్ పంపకాలన్నింటిలో కెల్లా అత్యంత ప్రజాదరణ పొందినది. 28 ఏప్రిల్ 2011 న విడుదలైన 11.04 రూపాంతరములో సిడి/డివిడి నుండి నేరుగా తెలుగులో స్థాపించుకోవటమే కాకుండా, సాధారణ వాడుకకు చాలావరకు తెలుగులో అదేశాల వరుసలు(మెనూలు), వివరణలు కనబడతాయి. అందువలన ఇంగ్లీషు బాగా తెలియని వారు కూడా దీనిని వాడుకోవచ్చు. దీనిని సులభంగా వాడుకోవడానికి తెలుగు వారి కోసం చేస్తున్న చిన్న పుస్తకమే ఈ ప్రయత్నం.

*బొమ్మ 1: ఉబుంటు చిహ్నం*

ఇది జీవంగల పుస్తకం [1] అనగా దీనిలో మార్పులు ఎల్లకాలం జరుగుతూ వుంటాయి. ఈ పనిలో మీరు రకరకాలుగా తోడ్పడవచ్చు: వ్యాసాలను వ్రాయటం సరిదిద్దటం, బొమ్మలను చేర్చటం, లేదా ఈ పుస్తకంలోని దోషాలను తెలపటం, ఈ పుస్తకాన్ని మెరుగు పరచడానికి మీ సలహాలను, సూచనలను తెలియజేయడం. దీని తయారీలో మీరు పాలుపంచుకుంటారని ఆశిస్తున్నాం.

1 ఉబుంటు_వాడుకరి_మార్గదర్శని (http://tinyurl.com/3e7zeu4)

# పరిధి

ఈ పుస్తకం ఉబుంటు మరియు దానిలో తరచుగా వాడే అనువర్తనాలను సమర్థవంతంగా స్థాపించడానికి, సాధారణ అవసరాలకు వాడటానికి అవసరమైన సూచనలు, చిత్రాలతో వివరిస్తుంది. కంప్యూటర్ ప్రాథమికాంశాల గురించి వివరించదు. వాటికోసం చదువరులు ఇతర అంతర్జాల వనరులను [2] [3] [4] వాడుకోవలసిందిగా సూచించడమైనది. ఉబుంటుతో అప్రమేయంగా ఇవ్వబడే అనువర్తనాలను లేక వాటితో పాటు వాడే ప్రజాదరణ పొందిన జాలస్థలాలనుమాత్రమే ప్రముఖంగా వివరించడం జరుగుతుంది. అయితే వీటి విస్తరణల కొరకు అంతర్జాలం నుండి కొంత అదనపు సాఫ్ట్వేర్ పొందవలసి రావచ్చు. అటువంటి వాటిని ఉబుంటు సాఫ్ట్వేర్ కేంద్రము ద్వారా స్థాపించుకోవచ్చు. కొన్ని సార్లు అంతర్జాల చిరునామాల ద్వారా మాత్రమే తెచ్చుకోవడం మాత్రమే వీలైతే వాటిని ఇవ్వడం జరుగుతుంది.

# నిష్పూచి

ఈ పుస్తకంలోని వివరాలు ప్రజలకు ఉపయోగంగా వుండగలవనే విశ్వాసంతో ఇవ్వబడినవి. వీటి నాణ్యతపై ఏ హామీలులేవు. ఒకవేళ మీ కంప్యూటర్ వ్యవస్థకు ఏదైనా హాని సంభవించిన దీని తయారీకి కృషిచేసిన వారు,పంపిణీ చేసినవారు, వికీమీడియాఫౌండేషన్ లేక ఇతర వికీమీడియా అనుబంధ సంస్థలు ఏ బాధ్యత వహించవు. దీనిలో చెప్పినవి ప్రయత్నించేముందు మీ ఫైళ్లు భద్రపరచుకోండి.

---

2సిడాక్ వారి కంప్యూటర్ ప్రాథమికాంశాలు ఇ-శిక్షక్ (http://tinyurl.com/3zynbp9)
3భారత ప్రగతి ద్వారం వారి ఐటిలో ప్రాథమికాంశాలు (http://tinyurl.com/3ult56s )
4కంప్యూటర్లలో తెలుగు వాడకం వివిధ సాఫ్ట్వేర్ల పరిచయం (http://tinyurl.com/43hs3v4)

# గుర్తింపులు

ఈ పుస్తకం వ్యాసాలకు కృషిచేసిన వారి వివరాలు వికీబుక్స్ లోని ఉబుంటు వ్యాసాల చరిత్రలో చూడవచ్చు. వీరు ఉబుంటు తెలుగు స్థానికీకరణ జట్టు[5], తెలుగు లినక్స్ వాడుకరుల జట్టు మరియు తెలుగు వికీమీడియన్లు. వీరే కాక దాదాపు పది ఏళ్లకుపైగా తెలుగు స్థానికీకరణకై స్వచ్ఛందంగా లేక సంస్థల తరపున కృషిచేసిన వారెందరో వున్నారు. వారిలో ముఖ్యంగా పేర్కొనలసినది స్వేచ్ఛ సంస్థ[6]. వారందరి కృషిఫలితమే ఈ నాటి తెలుగు ఉబుంటు లేక ఇతర లినక్స్ పంపకాలు.

5ఉబుంటు తెలుగు స్థానికీకరణ జట్టు (http://tinyurl.com/3vxyhzk)
6స్వేచ్ఛ సంస్థ (http://tinyurl.com/3nfxafo)

# ఉబుంటు చరిత్ర

ఉబుంటు [1]ఒక లినక్సు పంపకం. ఇది డెబియన్ జి.యన్.యు/లినక్సు మీద నిర్మించబడింది. దీని పంపంకందారు మార్క్ షటిల్వర్త్ స్థాపించిన కనోనికల్ లిమిటెడ్. ఈ పంపకం పేరు దక్షిణ ఆఫ్రికా లోని బంటు భాషలో ఉబుంటు అనగా ఇతరుల పట్ల మానవత్వం నుండి వచ్చింది. అనగా కంప్యూటర్ ని ప్రతివారికి సులభం చేయటం మరియు అందరు కలిసి సాఫ్ట్వేర్ అభివృద్ధి చేయడం అనేవి దీని ముఖ్య లక్షణాలు. ప్రతి 6 నెలలకు ఒక కొత్త రూపాంతరము(వెర్షన్) విడుదల చేయబడుతుంది. ఉబుంటు లినక్స్ ను స్వేచ్ఛగా, ఉచితముగా వాడుకొనవచ్చును, మరియు కాపీలను సంకోచము లేకుండ ఇతరులకు యియ్యవచ్చును. పాఠశాలల కొరకు ప్రత్యేక ఎడ్యుబుంటు అను అవతారము , ఇంకా కుబుంటు, క్జుబుంటు మరియు ఇతర అవతారములు గలవు.

## లక్షణాలు

సులువుగా వాడటం కోసం నిర్వహణ విధులకొరకు వేరొక వ్యవస్థ నిర్వహణాధికారి అవసరంలేకుండా సాధారణ వాడుకరి **సుడో** (sudo) అన్న ఉపకరణాన్ని నిర్వహణ ఆదేశాల ముందు చేర్చి వాడుకోవచ్చు. స్థాపన మాధ్యమం నుండి హార్డ్ డిస్క్ లో స్థాపించవచ్చు. కంప్యూటర్ ని తిరిగి ప్రారంభించనవసరం లేదు. అశక్తులైనవారికి సౌకర్యాలు, అంతర్జాతీయంగా వాడటం దీనిలో ప్రాముఖ్యతకలిగివున్నది. యు టి ఎఫ్-8 అక్షరపు ఎన్కోడింగు 5.04 విడుదలనుండి అప్రమేయంగా వాడబడుతున్నది. దీనివలన అన్ని భాషల వారు వాడటం కుదురుతుంది. దీనితోపాటు కార్యాలయ పనులకొరకు అనువర్తనం లిబ్రెఆఫీసు , అంతర్జాల విహారిణి ఫైర్‌ఫాక్స్, త్వరిత వార్తావాహిని పిడ్జిన్, చిత్రాలను మార్పుచేయు అనువర్తనము జింప్ , రకరకాలైన ఆటలు సుడోకు, చదరంగం

1 ఉబుంటు లినక్స్ (http://tinyurl.com/465s2)

సాఫ్ట్వేర్ దొరకుతాయి. అవసరంలేని నెట్‌వర్క్ పోర్టులు మూసి వుంటాయి కాబట్టి, కంప్యూటర్ రక్షణ పెరుగుతుంది.

## 11.04 తాజా విశేషాలు

11.04 విడుదలలో గ్నోమ్2. 32.1 కలిగివుంది. గ్నోమ్ షెల్‌కు బదులుగా యూనిటీ అనే సరికొత్త అంతర్వర్తి (interface) రూపం లభిస్తోంది. ఇది పాత తరం కంప్యూటర్లలో 2D మరియు కొత్తతరం కంప్యూటర్లలో 3D రూపాలలో వుంటుంది.

## రంగస్థలం

ఉబుంటు తెలుగురూపంలో కూడా అందుబాటులో వుంది. దీనికొరకు స్థాపన సమయంలోనే తెలుగు ఎంచుకోవచ్చు లేక ఇంగ్లీషులో స్థాపన పూర్తయిన తర్వాత System->Administration->Language support లో Install/Remove Languages లో తెలుగు ని ఎంపికచేసుకొని స్థాపించుకోవాలి.




*బొమ్మ2: యూనిటీ2D అంతర్వర్తి రూపం*

# ఉబుంటు ఒన్ (క్లౌడ్ నిల్వస్థలము)

క్లౌడ్ నిల్వస్థలము ద్వారా డేటాని ఎప్పుడైనా ఎక్కడైనా వాడుకోటానికి, భద్రం చేసుకునేలా ప్రత్యేక సర్వీసుని రూపొందించారు. అదే ఉబుంటు ఒన్[2]. దీంట్లో ఉచితంగా ఖాతా సృష్టించుకొని ముఖ్యమైన దస్త్రాలను భద్రం చేయవచ్చు. దీంతో అంతర్జాల సంపర్కముతో ఎక్కడనుండైనా డేటాని పొందవచ్చు. ఇష్టాంశాలు, సంపర్కాలు, సంగీతం, ఫైళ్లు, బొమ్మలు దీంట్లోకి భద్రం చేసుకోవచ్చు. 2 జీబీ క్లౌడ్ నిల్వస్థలము (క్లౌడ్ స్టోరేజీ స్పేస్)ను ఉచితంగా అందిస్తున్నారు. ఐఫోన్, ఆండ్రాయిడ్ ఫోన్ల నుంచి 1000 నెంబర్లను భద్రం చేసుకోవచ్చు.

2 ఉబుంటు ఒన్ (http://tinyurl.com/2c7sdhy)

# స్థాపన

## సిఫారస్ చేయబడిన హార్డ్వేర్ లక్షణాలు

- 1 GHZ ప్రాసెసర్ (ఇంటెల్/ఎఎమ్‌డి(AMD)

- 1 GB రేమ్

- 15 GB హార్డ్ డిస్క్ ఖాళీస్థలం

- గ్రాఫిక్స్ కార్డ్ మరియు మానిటర్ విభాజకత 1024x768

- సిడి/డివిడి డ్రైవ్ లేక/మరియు యుఎస్బి (USB) పోర్ట్

- అంతర్జాల(ఇంటర్నెట్) సంపర్కం (వుంటే మంచిది)

ఈ పై లక్షణాలు బాగా చురుకుగా పనిచేయటానికి కావాలి. సాధారణంగా విండోస్ XP ఆపైన నిర్వహణ వ్యవస్థలు నడిచే ఏ కంప్యూటర్ ఐనా సరిపోతుంది. వాటికంటే వేగంగా పనిచేస్తుంది. అంతే కాకుండా మీ కంప్యూటర్ కి ఏ హానీ జరగకుండా ప్రత్యక్ష బూట్ సిడి/డివిడి తో పరీక్షించి ఆ తరువాత స్థాపించుకోవచ్చు.

# సిడి/డివిడి పొందుట

386 సిడి/డివిడి డెస్క్‌టాప్ ఇమేజ్(3.9GB)ఇంటెల్ లేక ఎఎమ్‌డి(AMD) ప్రాసెసర్‌కు సరిపోతుంది[1]. దీనిలో నేటి లేక తరువాత విడుదలలో. "...-i386.iso.torrent " అనే ఫైల్‌ని ట్రాన్స్మిషన్ లాంటి టొరెంట్ ఫైల్ పొందు అనువర్తనాలలో తెచ్చుకుంటే మంచిది. కంప్యూటర్‌కు ఏదైనా అంతరాయం కలిగినా ఫైల్ పొందటం కొనసాగుతూ వుంటుంది. నెట్ లో బిఎస్ఎన్ఎల్ బ్రాడ్ బాండ్ 512 Kbps అనుసంధానం ద్వారా పొందటానికి దాదాపు 22 గంటలు పట్టవచ్చు. ఆ తరువాత దానిని సిడి/డివిడి పై రాయండి(బర్న్ చేయండి). నేరుగా సిడి/డివిడి నుండి స్థాపన లేక ప్రత్యక్ష అనుభవం ఎంచుకొని మొత్త సిద్ధం అయినతరువాత స్థాపన ప్రయత్నించవచ్చు. స్థాపన మీ కంప్యూటర్ సామర్ధ్యాన్ని బట్టి గంట నుండి నాలుగు గంటల పట్టవచ్చు కాబట్టి, ప్రత్యక్ష అనుభవం ఎంచుకొంటే స్థాపన జరిగేటప్పుడు మీ వెబ్ వీక్షణ పనిని కొనసాగించుకోవచ్చు. స్థాపనకు ఆన్లైన్ సంపర్కము వుంటే మంచిది. అవసరమైతే తెలుగుకి కావలసిన పాకేజీలు లేక వాటి నవీకరణలో స్థాపనలో భాగంగా తెచ్చుకొని స్థాపించుతుంది.

ఒక వేళ మీకు వేగవంతమైన ఇంటర్నెట్ సంపర్కం లేకపోతే, కంప్యూటర్ పత్రికలు లేక కంప్యూటర్ దుకాణాలు ఇతర కంప్యూటర్ వాడే మిత్రుల నుండి సిడి/డివిడిలు పొందవచ్చు.

# స్థాపన

మీ సిడి/డివిడి డ్రైవ్లో ఉబుంటు డివిడి అమర్చి బయోస్ (BIOS) సెట్ అప్ లో వాటిని బూట్ కి చేతనం చేసి కంప్యూటర్ స్విచ్ ఆన్ చేయండి.

1 ఉబుంటు దొరుకు వెబ్సైట్(http://tinyurl.com/mb89w)

# భాషా ఎంపిక




*బొమ్మ3: భాషఎంపిక*

ఆ తరువాత కనబడే తెరలో బూట్ స్క్రీన్ లో భాషఎంపిక కనపడుతుంది. తెలుగు ఎంచుకోండి. **త ొలుగు** అని కనబడుతుంది అయినా గాభరాపడవద్దు. టర్మినల్ లో తెలుగు లాంటి భాషలకు పూర్తి తోడ్పాటు రాలేదు. సాధారణ వాడుకరులు గ్రాఫికల్ అంతర్వర్తి వాడతారు (స్థాపనలో ఆ తరువాత వచ్చే తెరనుండి) కాబట్టి వాటిలో లోపాలు లేని తెలుగు కనబడుతుంది.

# బూట్ విధానం ఎంపిక




*బొమ్మ4: బూట్ విధానం ఎంపిక*

బూట్ మొదటి తెర బూట్ వ్యవస్థ వాడు విధం. దీనిలో మొదటి వరుస ప్రత్యక్ష అనుభవం (Try Ubuntu without Installing). ఇతర ఎంపికలు నేరుగా స్థాపన, పాఠం విధానంలో స్థాపన, డిస్క్ లో దోషాల తనిఖీ, మెమరీ పరీక్ష, మొదటి హార్డ్ డిస్క్ నుండి బూట్, పనిచేయని వ్యవస్థను బాగుచేయు అనే ఇతర ఎంపికలు వుంటాయి. వాటిని కీబోర్డుతో (బాణంగుర్తులుగల కీలువాడి) ఎంచుకోవచ్చు. ప్రత్యక్ష అనుభవం ఉద్దీపనం చేసి దాఖలు (ENTER) చేయండి ఎంచుకోండి. ఒక వేళ భాష ఎంపిక చేయుట మొదటి సారి తెర కనిపించిన 30 సెకండ్లలో చేయలేక పోయినట్లైతే F2 కీ వాడి భాష ఎంపిక చేయవచ్చు.

# ప్రత్యక్ష అనుభవం డాష్‌బోర్డ్

దీనిని వాడుకొని మీ వ్యవస్థ పరికరాలు, అనువర్తనాలు పనిచేస్తున్నదీ లేనిది పరిశీలించండి. మీ అనుభవంతో తృప్తిపడితే ఈ డాష్‌బోర్డ్ లో స్థాపించు ఉబుంటు 11.04 (Install Ubuntu 11.04) అన్న ప్రతిమను నడపవచ్చు. అప్పుడు మరల భాష ఎంపిక ఇతర ఎంపికలు చేయవలసివుంటుంది.




*బొమ్మ 5: ప్రత్యక్షఅనుభవం డాష్‌బోర్డ్*




*బొమ్మ 6: తెలుగు స్థాపన ఎంపిక*

# విభజన ఎంపిక

మీ హార్డ్‌డ్రైవ్ లో ఇప్పటికేవున్న నిర్వహణ వ్యవస్థల వివరాలు తెలిపి ఉబుంటుకోసం వాడవలసిన హార్డ్‌డిస్క్ విభజన(పార్టిషన్)ఎంపిక చేయటమే ఈ దశ ముఖ్యోద్దేశం. ఖాళీ వుంటే ఆ ఖాళీ స్థలము వాడుకొనేటట్లు చేయవచ్చు. లేకపోతే ప్రస్తుతమున్న విభజనలను కుదించి ఖాళీ స్థలాన్ని ఏర్పాటు చేసే ఎంపిక చేయవచ్చు. కాని ఇలా చేసేటప్పుడు ముందుగా మీ డాటాని భద్రపరచుకోండి.

ఇప్పటికే వాడుతున్న కంప్యూటర్ పై స్థాపించేటప్పుడు, సాధారణంగా ఉబుంటు మీ నిర్వహణ వ్యవస్థలను అలానే వుంచి కొత్త ఉబుంటు ని స్థాపించమనే ఎంపిక మొదటిదిగా చూపెడుతుంది. దీనిని మీరు ఎంచుకుంటే సులభంగా వుంటుంది. దీనికి కేటాయించిన నిల్వ మొత్తం ఒకే వేరు(root)గల ఫైల్ వ్యవస్థగా వాడుతుంది. ఇలాగా చేస్తే ముందు ముందు కొత్త ఉబుంటు వ్యవస్థలకు మారటానికి మీరు నివాస సంచయాన్ని భద్రపరచుకోవాలి. అలా కాకుండా మానవీయంగా ఈ క్రింది వేరులకు మీ నిల్వను కేటాయిస్తే ముందు ముందు తాజాకరణలు మీ నివాస

సంచయం అలాగే వుంచుకొని చేసుకోవచ్చు. సిఫారస్ చేయబడిన వేరులు మరియు వాటికి నిల్వలు క్రింది పట్టికలో ఉదాహరణగా ఇవ్వబడినవి.

| **వేరు** | **కనీస నిల్వ గురించి సూచనలు** |
|---|---|
| /boot | కనీసం 250 MB |
| swap | మీ రేమ్ మెమరీకి రెట్టింపు. ఉదాహరణకి మీ మెమరీ 1 GB ఐతే మీరు దీనికి 2 GB కేటాయించాలి |
| /home | మీ వ్యవస్థని వాడే వారికి ఒక్కొక్కరికి అవసరమైనది లెక్కించి కావలసిన నిల్వ నిర్ణయించవచ్చు. ఫొటోలు, సంగీతం, సినిమాలు వాడేవారికి చాలా ఎక్కువ నిల్వ అవసరము. సాధారణ వాడుకరికి 10 GB సరిపోతుంది. కాని మీ డిస్క్ నిల్వని బట్టి ఎక్కువ ఇచ్చుకోవచ్చు. |
| / | దీనిలో మిగతా ఫైల్ వ్యవస్థ వుంటుంది. కనీస ఉబుంటు దాదాపు 2.5 GB సరిపోతుంది. అయితే స్థాపించటానికి కావలసిన కనీస నిల్వ దీనికన్నా ఎక్కువ. |

*పట్టిక 1: మానవీయ విభజన వివరాలు*

# వాడుకరి వివరాలు చేర్చుట

ఈ తెరలో మీ పూర్తిపేరు, వాడుకరి పేరు, సంకేత పదం (రెండు సార్లు) ప్రవేశపెట్టవచ్చు. ప్రక్కన ఇచ్చిన ఫొటోలో అర్జున అన్న వాడుకరి పేరు ప్రవేశపెట్టటం చూడవచ్చు. మొదటి వరుసలో కావాలంటే తెలుగులో మీ పేరు రాసుకోవచ్చు. చాలా అరుదుగా వాడబడే టర్మినల్ లో తెలుగు తోడ్పాటు పూర్తిస్థాయిలో లేనందున మీ వాడుకరి




*బొమ్మ 7: వాడుకరి వివరాలు చేర్పుట*

పేరు ఇంగ్లీషులోనే వుంచుకోవటం మంచిది. సంకేత పదంలో అక్షరాలు, అంకెలు వుండేటట్లుచూసుకుంటే మంచిది.

# ప్రయత్నించబడిన హార్డ్వేర్

• డెల్ ఇన్స్పిరాన్ 600M లాప్టాప్, పెంటియమ్ మొబైల్ ప్రాసెసర్@1.6GHz, 1 GB రేమ్, 80 GB హార్డ్ డిస్క్ (మార్కెట్ ప్రవేశం 2003).

•డెస్క్‌టాప్ i945 చిప్‌సెట్ ఇంటెల్ కోర్ 2 డ్యుయో సిపియు CPU E7200 @ 2.53GHz (మార్కెట్ లోకి వచ్చిన సంవత్సరం 2008), దీనిలో ధ్వని కొరకు ALC883 వాడారు. మరియు 2GB రేమ్, 160 GB హార్డ్ డిస్క్, ఏసర్ డివిడి రైటర్, సోనీ డివిడి రామ్, శామ్సంగ్ శామ్ట్రాన్ 55V 1024x768 విభాజకత CRT మానిటర్, శామ్సంగ్ scx-3201 బహుళకార్య లేజర్ ప్రింటర్(మార్కెట్లో లభ్యత 2010), లాజిటెక్ వెబ్‌కేమ్( ID 046d:08af లాజిటెక్ ఇంక్. క్విక్‌కేమ్ ఈజీ/కూల్).

# రంగస్థలం

ఉబుంటు రంగస్థలం యూనిటీ రెండు రూపాలలో లభిస్తుంది. కొంత కాలక్రింద విడుదలైన కంప్యూటర్లలో 2D ప్రతిమల రూపంలో(ఉబుంటు క్లాసిక్), మరియు కొత్తతరం కంప్యూటర్లలో 3D ప్రతిమలుమరియు సచేతనం (యానిమేషన్) ప్రభావాలతో కనిపిస్తుంది.

## ప్రవేశం (లాగిన్)

మీరు కంప్యూటర్ ప్రారంభించినపుడు, మీ కంప్యూటర్‌పై ఉబుంటు మాత్రమే స్థాపించబడివుంచే ప్రవేశ తెర కనబడుతుంది. లేక ఇతర వ్యవస్థలు కూడా వుంటే వాటి ఎంపిక తెర (GRUB) కనబడుతుంది. దానిలో ఉబుంటు ఎంపిక చేసినపుడు, మీకు ప్రవేశ తెర కనబడుతుంది. గ్రబ్ తెర లో క్రింది విభాగంలో వివరణ తెలుగులో వున్నా కూడా సులభంగా చదవటానికి ఇబ్బంది. ఎందుకంటే గ్రబ్ లో అంతర్జాతీయ భాషల తోడ్పాటు భాగంలో తెలుగు కి పూర్తిగా సరిగా లేదు. కాని ఇదేమీ గాభరాపడే విషయం కాదు. తెలుగు అక్షరాలు గుణింతాలు వత్తులు విడివిడిగా వస్తాయి కాస్త శ్రద్ధపెడితే అర్థమువుతంది. ఆ వివరం ఇంతకీ ఏమిటంటే బాణంగుర్తులు వాడి మీకు కావలసిన నిర్వహణ వ్యవస్థ ని వుద్దీపనం చేసి దాఖలు (ENTER) చెయ్యమనటమే. రద్దు చేయటానికి **C** నొక్కాలి. ప్రవేశ తెర దగ్గరనుండి గ్రాఫికల్ వాడుకరి అంతర్వర్తి లో తెలుగు చక్కగా కనిపిస్తుంది.

# ప్రవేశ తెర

దీనిలో మీరు వాడుకరిపేరు ని ఎంచుకొని ఆ తరువాత అట్టడుగు వరుసలో మీకు కావలసిన స్థానికత (తెలుగు లేక ఇంగ్లీషు), కీ



*బొమ్మ8: ప్రవేశ తెర*

బోర్డు నమూనా ఎంచుకొని, సంకేత పదం టైపు చేసి దాఖలు (ENTER) చెయ్యవచ్చు, అదే కాక కంప్యూటర్ ని అనుకూలపరచుకోవచ్చు. తెలుగు కీ బోర్డు ఇక్కడి నుండే అందుబాటులో వుంటుంది. ఎడమవైపు పైఅక్షరాలమీట(Left Shift) మరియు ఆల్ట్(Alt) మీట కలిపి నొక్కితే మీ కీ బోర్డు USA మరియు భారతదేశము(తెలుగు) అనగా ఇన్స్క్రిప్ట్ మధ్య మారుతుంది. అయితే మీ వాడుకరి పేరు, సంకేతపదం ఇంగ్లీషు లోనే వాడుకోవటం మంచిది. టర్మినల్ అనువర్తనం లో తెలుగు మద్ధతు పూర్తి స్థాయిలో లేదు కనుక ఈ సూచన చేయడమైనది. మీరు తెలుగు ఎంపిక చేసినపుడు మీ కీ బోర్డులో మూడవ బల్బు (పెద్దబడి తాళం మరియు అంకెల తాళం బల్బు కాక చివరిది) వెలుగుతుంది. తెరపై కనబడే కీ బోర్డు ఎంపిక తో పాటు ఇది మీ కీ బోర్డు స్థితిని తెలుసుకొని వాడుటలో సహాయం పడుతుంది.

# 2D రూపం




*బొమ్మ9: ఉబుంటు క్లాసిక్(2D) అంతర్వర్తి(interface)*

కొంత కాలక్రింద విడుదలైన కంప్యూటర్లలో గ్రాఫిక్స్ ప్రభావాలు తక్కువ. అనువర్తనాల ప్రతిమలు సమతల చిత్రాలు రూపంలో వుంటాయి. కావలసిన అనువర్తనము నడపటానికి లేక ఆదేశం ఎంపికకు పాఠ్య మెనూ వాడుతారు.

# వ్యవస్థ అమర్పులు మార్చటం

మెనూలో సిస్టమ్ ఎంచుకుంటే మీకు సహాయక అనువర్తనాలు కనబడతాయి. వాటిని వుపయోగించి వ్యవస్థని మీకు తగినట్లుగా మలచుకోవచ్చు,

## అనువర్తనాల తో పనులు

మీ కంప్యూటర్ చేసే పనిని బట్టి అప్రమేయ అనువర్తనాలు స్వయం చాలకంగా చేతనం అవుతాయి. ఒకవేళ మీరు మానవీయంగా అనువర్తనం ప్రారంభించాలనుకుంటే, మీరు వాడే ఫైల్ లేక పరికరము పై మోస్ నిలిపి కుడి మీట నొక్కితే తెరుచు అన్న మెనూ కనబడుతుంది. దానితో మీకు కావలసిన అనువర్తనం ఎంపికచేసి ప్రారంభించుకోవచ్చు. ఇక మీరు కొత్త అనువర్తనం స్థాపించుకోవాలంటే సినాప్టిక్ పేకేజి నిర్వాహికి ని ప్రారంభించి దానిలో మీకు కావలసిన పేకేజి పేరుతో వెతకవచ్చు. లేకపోతే ఉబుంటుసాఫ్ట్వేర్ కేంద్రము లో వర్గాల వారీగా వున్న అనువర్తనాల నుండి మీకు కావలసిన దానిని స్థాపించుకోవచ్చు. దీనికొరకు పాకేజి పేరు తెలియాల్సిన పనిలేదు.

## ఫైళ్లతో పనులు

మీరు అనువర్తనాలు వాడినపుడు కొత్తఫైళ్లు సృష్టించటమో మార్చటమో చేస్తారు. ఇటీవలే వాడిన పత్రాలు అనువర్తనాల లోపటి మెనూద్వారా తిరిగి వాడవచ్చు. భద్రపరచేటప్పుడు లేక ఇతరత్రా వాడాలనుకున్నప్పుడు, మెనూలో స్థలాలలో నివాసం ఎంపికచేసుకొని మీకు కావలసిన ఫైల్ కోసం వెతకవచ్చు. మీరు తొలగించేఫైళ్లు చెత్తబుట్టలో చేర్చబడతాయి. అవసరమైనపుడు చెత్తబుట్టనుండి తిరిగి తెచ్చుకొనవచ్చు.

# 3D రూపం

దీనిలో మీకు లోతుతో కూడిన బొమ్మలు, పారదర్శకమైన పొరలు కనబడతాయి. ఇంతకు ముందల రూపంతో గల లక్షణాల కంటే ఇది విలక్షణంగా వుంటుంది. తెర అంతా బొమ్మలు ప్రధానంగా వుంటాయి. మౌస్ వాటిపై కదిల్చినపుడు మాత్రమే వాటి పేరు కనబడుతుంది. వాటిపై నొక్కినపుడు, బొమ్మ నేపథ్యం వెలిగిఆరుతూ

జరుగుతున్న పనిని సూచిస్తుంది.

అనువర్తనం ప్రారంభమైనపుడు బొమ్మల లాంచర్ మెనూ ఎడమవైపుకు దాగుతుంది.




*బొమ్మ 10: యూనిటీ3D అంతర్వర్తి*

గత దశాబ్దకాలంలో కంప్యూటర్ వెబ్ వినియోగదారులకు వెతకటం అనే ప్రక్రియ సాధారణమయ్యింది. ఇదే పద్ధతిలో అనువర్తనాలకోసం లేక పత్రాలకోసం వెతకటం ఉబుంటులో సాధారణమవుతుంది. లాంచర్ మెనూలో అడుగున భూతద్దం (+) గుర్తుతో కనిపించేదానిమీద నొక్కితే మీకు వెతుకు తెర కనపడుతుంది. వెతుకు పెట్టె స్వయంచాలకంగా చేతనం అవుతుంది. అందుకని టైపు చేయగానే ఆ పెట్టెలో అక్షరాలు కనపడతాయి. ఆ పెట్టెలో ప్రత్యేకంగా మౌస్ తో నొక్కి ఆ తరువాత టైపు చేయవలసినపనిలేదు. లాంచర్ లో వున్న వాటిని కీబోర్డు తో నే వాడుకోటానికి దగ్గరిదారులు వున్నాయి. దీనికొరకు నిర్వహణ వ్యవస్థ మీట (సాధారణ కీబోర్డులలో విండోస్ ప్రతిమ వున్న మీట దీనినే సూపర్ అంటారు) మరియు ఇంకొక మీట (పనిని బట్టి) తో త్వరగా పని చేయెచ్చు. సిస్టమ్ లక్షణాలు పవర్ బటన్ ను మౌస్ తో కుడి క్లిక్ చేసినపుడు చివరి మెనూ అంశంగా కనబడుతుంది. దీనిలో సిస్టమ్ లక్షణాల అనువర్తనాలను ఎంపికచేసుకొని నడపవచ్చు.

# వ్యవస్థ అమర్పులు మార్చటం

కుడిపై మూలలో వున్న కంప్యూటర్ పవర్ ప్రతిమ పై నొక్కితే మీకు మెనూ కనబడుతుంది. దానిలో వ్యవస్థ అమరికలు(System Settings)వ్యవస్థని మీకు తగినట్లుగా మలచుకోవచ్చు. మీరు దీనిని వాడేటప్పుడు వెతకటానికి తెలుగు పేర్లు వాడవచ్చుని గమనించండి.

# అనువర్తనాల తో పనులు

మీ కంప్యూటర్ చేసే పనిని బట్టి అప్రమేయ అనువర్తనాలు స్వయం చాలకంగా చేతనం అవుతాయి. ఒకవేళ మీరు మానవీయంగా అనువర్తనం ప్రారంభించాలనుకుంటే, మీరు వాడే ఫైల్ లేక పరికరము పై మోస్ నిలిపి కుడి మీట నొక్కితే తెరుచు అన్న మెనూ కనబడుతుంది. దానితో మీకు కావలసిన అనువర్తనం ఎంపికచేసి ప్రారంభించుకోవచ్చు. ఇక మీరు కొత్త అనువర్తనం స్థాపించుకోవాలంటే వ్యవస్థ అమరికలు లో సినాప్టిక్ పేకేజి నిర్వాహికి ని ప్రారంభించి దానిలో మీకు కావలసిన పేకేజి పేరుతో వెతకవచ్చు. లేకపోతే కుడి వైపు డాక్ నుండి అనువర్తనాల వెతుకు ప్రతిమనొక్కి ఉబుంటుసాఫ్ట్వేర్ కేంద్రము లో వర్గాల వారీగా వున్న అనువర్తనాల నుండి మీకు కావలసిన దానిని స్థాపించుకోవచ్చు. దీని కొరకు పాకేజి పేరు తెలియాల్సిన పనిలేదు. ఇక్కడ వెతికేటప్పుడు ఇంగ్లీషు అక్షరాలు మాత్రమే పనిచేస్తాయి

# ఫైళ్లతో పనులు

మీరు అనువర్తనాలు వాడినపుడు కొత్తఫైళ్లు సృష్టించటమో మార్చటమో చేస్తారు. ఇటీవలే వాడిన పత్రాలు అనువర్తనాల మెనూద్వారా తిరిగి వాడవచ్చు. భద్రపరచేటప్పుడు లేక ఇతరత్రా వాడాలనుకున్నప్పుడు, మెనూలో

నివాస సంచయం ఎంపికచేసుకొని మీకు కావలసిన ఫైల్ కోసం వెతకవచ్చు. మీరు తొలగించే ఫైళ్లు చెత్తబుట్టలో చేర్చబడతాయి. అవసరమైనపుడు చెత్తబుట్టనుండి తిరిగి తెచ్చుకొనవచ్చు. ఎడమవైపు డాక్ నుండి ఫైళ్లు వెతుకుటకు ప్రతిమ నొక్కి వెతకవచ్చుకూడా.

# కంప్యూటర్ పని ముగింపు



*బొమ్మ 11: పని ముగింపు ఎంపికలు*

మీ డాష్‌బోర్డు కుడిపై మూలలో కంప్యూటర్ శక్తి (వృత్తంలో ఒక గీత )గుర్తుపై నొక్కండి. దానిలో **మూసివేయు** ఎంపికతో మీ వ్యవస్థ ముగించవచ్చు. ఈ ఎంపికతో ఇటీవలి కంప్యూటర్లకు స్వయంచాలకంగా విద్యుత్తు సరఫరా కూడా నిలిపివేయటం జరుగుతుంది. లేకపోతే ముగింపు పూర్తి అయిందనే సందేశం తరువాత మానవీయంగా విద్యుత్ సరఫరా నిలిపివేయాలి. ఇతరులు వాడాలంటే వారికి వేరేగా ఖాతాలు ఏర్పాటు చేస్తే మీరు లాగౌట్ చేసినప్పుడు కంప్యూటర్ వారు వాడటానికి సిద్ధం అవుతుంది.

# తెలుగు టైపు చేయటం

ఉబుంటు/తెలుగు లినక్స్ లో టైపింగు చేయు విధానాలు చాలా వున్నాయి. ఈ విభాగంలో భారతదేశం ప్రామాణిక ప్రవేశపెట్టుపద్దతి ఐన ఇన్స్క్రిప్ట్ గురించి వివరంగా మరియు ఇతర పద్ధతులుగురించి క్లుప్తంగా తెలుసుకుందాము.

## సహజతోడ్పాటుతో ఇన్‌స్క్రిప్ట్

ఉబుంటు తెలుగుతో స్థాపించినపుడు, లేక తెలుగు భాషా పాక్ స్థాపించినపుడు సహజంగా ఇన్‌స్క్రిప్ట్ కీ బోర్డు ఇండియా తెలుగు అనే పేరుతో లభ్యమవుతుంది. దీనిని అన్ని భారతీయ భాషలని విశ్లేషించి, ఒకేలా వుండేలా ప్రామాణీకరించారు. దీనిలో ఎడమవైపు అచ్చులు కుడివైపు హల్లులు వున్నాయి. అచ్చుల కీలలో గుణింతాలు మామూలుగాను, షిఫ్ట్ తో అచ్చులుగాను వస్తాయి. హ్రస్వ అచ్చులు ప్రధాన వరుసలో, దీర్ఘ అచ్చులు పై వరుసలో వున్నాయి. 'd' కు మామూలుగా హలాంత్ (్ నకార పొల్లు) వస్తుంది. దీనిని సంయుక్త అక్షరాలకు వాడతారు. చాల హల్లులకి హలాంత్ చేర్చినపుడు, లేక హల్లులకి గుణింతాలు రాసేటప్పుడు, ఎడమచేతి వేళ్ళు,తరువాత కుడిచేతి వేళ్ళు వాడాల్సి రావటంతో త్వరగా టైపు చేయటం కుదురుతుంది. హల్లుల కీలలో 5 వర్గాల మొదటి అక్షరాలు ప్రధాన వరుసలో వున్నాయి. షిఫ్ట్ తో వాటి రెండవ అక్షరాలు వస్తాయి. ముక్కుతో పలకని హల్లులను ఆ వర్గానికి దగ్గర కీలలో ఇచ్చారు. ముక్కుతో పలికే హల్లులను ఎడమవైపు చివరి వరుసలో ఇచ్చారు. మిగతావి కుడివైపు ఇచ్చారు. పై వరుసలో ఎక్కువగా వాడే సంయుక్త అక్షరాలని ఇచ్చారు. ఇవి నొక్కినపుడు, వాటి మూల అక్షరాల సమూహము వస్తుంది.

మామూలుగా వాడే ఇంగ్లీషు కీబోర్డు నుండి దీనికి మారటానికి టాగుల్ కీగా ఎడమవైపు షిఫ్ట్(Left Shift) మరియు ఆల్ట్(Alt) కీలను జతగా వాడతారు. దీని ప్రాధాన్యమేమంటే లాగిన్ స్థితి దగ్గరనుండి తెలుగులో టైపు చేయవచ్చు. అంటే మీ వాడుకరి పేరు, సంకేతనామం కావాలంటే తెలుగు లో రాయవచ్చు. అలాగే టర్మినల్ లో కూడా వాడవచ్చు.




*బొమ్మ 12: తెరపై తెలుగు కీబోర్డు కనబడు విధం*




*బొమ్మ 13: కీబోర్డు పై బల్బు వెలగటం (తెలుగు కీబోర్డు వాడునపుడు)*

తెలుగు టైపు ఎంచుకున్నపుడు పై పేనెల్ లో కీబోర్డు స్థితి Ind (India Telugu) గా మారుతుంది మరియు మీ కీబోర్డుపైన చివరి బల్బు వెలుగుతుంది. వీటివలన మీరు ఏ కీబోర్డు తీరు వాడుతున్నారో మీకు తెలుస్తుంది.




*బొమ్మ14: ఇన్‌స్క్రిప్ట్ కీబోర్డు*

# టైపింగ్ ఉదాహరణలు

**సాధారణ అక్షరాలు**

•అ=D, ఆ=E, ఇ=F,... ఔ=Q

•ప=h,పా=he, పి=hf...పం=hx

•ప్=hd, ప్ర=hdj, ప్రా=jdje,... ప్రాం=hdjx

•ప్యే=hd/s, పృ=h-

**పదాలు**

తెలుగు=lzngig

భారతదేశం=Yejl; osMx

**పారిభాషిక పదాలు**

పారిభాషిక పదాలను తెలుగులిపిలో రాసేటప్పుడు ప్రత్యేక అక్షరాలు వాడితే చదవటానికి సులభంగా వుంటుంది.

•ఒకహల్లు కి చాలా వత్తులు వచ్చే అవకాశం వుంది. అప్పుడు చదవటం కష్టమవుతుంది కాబట్టి, ఒకటి లేక రెండు వత్తులు వచ్చిన తరువాత శూన్యవెడల్పుతో దగ్గరిగా వుంచు(Zero Width Joiner(ZWJ) ) లేక శూన్యవెడల్పు తో ముందటి సంయుక్త అక్షరాన్ని విడదీయు (ZeroWidthNonJoiner(ZWNJ)వాడి రాయాలి. దీనికొరకు లినక్స్ వ్యవస్థలలోని x కీబోర్డు లో సదుపాయం లేదు. మీరు వాడే అనువర్తనంలో వున్న సదుపాయం వాడండి. ఉదా: పాఠ్యకూర్పరి (జిఎడిట్) లో మౌస్ కుడి మీట నొక్కితే యూనికోడ్ అక్షరం ప్రవేశపెట్టు

•సాఫ్ట్వేర్=meHd'<zwj> bsjd

•సాఫ్‌ట్‌వేర్=meHd'<ZWNJ> bsjd

# ఐబస్

ఐబస్ (ibus) కొరకు ప్రత్యేకంగా సాఫ్ట్వేర్ ప్యాకేజీ(ibus-m17n) పొంది స్థాపించుకోవాలి. లాగిన్ ప్రారంభమైనతర్వాత ఐబస్ డీమన్ ప్రారంభించి మనకు కావలసిన కీబోర్డు నమూనా (ఇన్స్క్రిప్ట్ తోసహా) ఎంచుకోవచ్చు. టాగుల్ కీ కూడా మనకిష్టమైనట్లుగా పెట్టుకోవచ్చు. సాధారణంగా కంట్రోల్(Ctrl) మరియు స్పేస్(Space) జతగా నొక్కాలి.




బొమ్మ15: ఐబస్ అభీష్టములు సాధారణ టాబ్




బొమ్మ16: ఐబస్ అభీష్టములు ఇన్పుట్‌పద్ధతులు టాబ్

తెలుగులో టైపుచెయ్యడానికి కీబోర్డు ప్రవేశపద్ధతి వ్యవస్థ(Keyboard input method system) లో ఐబస్ ఎంచుకోవాలి. ఐబస్ అభీష్టాలలో(System-> Preferences-> Ibus Preferences) మనకు నచ్చిన ప్రవేశ పద్ధతులలో (ఇన్‌స్క్రిప్ట్,ఐట్రాన్స్,ఆర్టిఎస్, ఏపిల్,పోతన) ఒకటి ఎంచుకోవాలి. ఇక మనం ఉబుంటు ఏ అనువర్తనంలో నైనా తెలుగు టైపు చేయవచ్చు.

# ఇతర పద్ధతులు

వెబ్లో మాత్రమే పనిచేసే పద్ధతులు మైక్రోసాఫ్ట్, గూగుల్,వికీపీడియా ద్వారా అందుబాటులో వున్నాయి. వాటి గురించి మరిన్ని వివరాలకు తెలుగు వికీపీడియాలో **కీ బోర్డు** అన్న వ్యాసం చూడండి.

# వెబ్ వీక్షణం




*బొమ్మ 17: వికీపీడియాలో తెలుగు వ్యాసం(2011-04-12 న)*

వెబ్ వీక్షణం లేక విహరించడానికి ముఖ్యమైన సాఫ్ట్‌వేర్లు ఫైర్‌ఫాక్స్ మరియు క్రోమియమ్.

# ఫైర్‌ఫాక్స్

ఫైర్‌ఫాక్స్ ఉబుంటు అప్రమేయ విహారిణి. దీనిని లాంచర్ నుండి కాని లేక మెనూలో అంతర్జాలం నుండి నడపవచ్చు. ప్రారంభంలో ఉబుంటు పేజీ చూపిస్తుంది. మీకు కావలసిన విషయంకోసం వెతుకుపెట్టెలో వెతికితే ఫలితాలు హైపర్లింక్లతో కనబడతాయి. వాటిని నొక్కడం ద్వారా ఆ సైట్ పేజీలను చూడొచ్చు. నేరుగా చిరునామా పట్టీలో వెబ్ చిరునామాను టైప్ చేసి మీకు కావలసిన పేజీని చూడొచ్చు.

ఉదాహరణ: ఫైర్‌ఫాక్స్ ప్రారంభించిన తరువాత చిరునామాలో http://te.wikipedia.org అని టైపుచేస్తే తెలుగు వికీపీడియా మొదటిపేజీ కనబడుతుంది. దానిలో పై కుడి వైపున వెతుకు పెట్టెలో తెలుగు అని టైప్ చేసి ఎంటర్ నొక్కండి. అప్పుడు తెలుగు వ్యాసపేజీ కనబడుతుంది.

తెలుగు వాడేవారు తెలుగు అక్షరక్రమ లేక ముద్రాక్షర తనిఖీ పాడిగింతని [1]స్థాపించుకుంటే మంచిది. విహారిణిలో ఈమెయిల్, బ్లాగ్ లేక వికీపీడియా లో టైపు చేసేటప్పుడు జరిగే కొన్ని అక్షర దోషాలను వాటి క్రింద ఎరుపు తరంగ గీతతో చూపిస్తుంది.



*బొమ్మ 18: ముద్రాక్షరాల తనిఖీ*

# క్రోమియమ్

ఉబుంటు సాఫ్ట్వేర్ కేంద్రము ద్వారా క్రోమియమ్ స్థాపించుకొనవచ్చు. దీనినే స్వల్పంగా మార్పులతో గూగుల్ క్రోమ్ లాగా కూడా అందుబాటులో వుంది.

1 ఫైర్‌ఫాక్స్ తెలుగు ముద్రాక్షర తనిఖీ పాడిగింత (http://tinyurl.com/4yye8ak)

# ఈ-ఉత్తరాలు మరియు ఛాట్

ఈ-ఉత్తరాలు అనగా ఎలెక్ట్రానిక్ మెయల్. మన పంపించే ఉత్తరాలు ఇంటర్నెట్ ద్వారా క్షణాల్లో అందుకునే వారి మెయిల్ సేవికలకు చేరి, మన పుత్తరాలు అందుకునే వారు కంప్యూటర్ వాడినపుడు వారికి వచ్చినఉత్తరాల పెట్టెలో కనబడుతాయి. ఛాట్ అంటే మన మిత్రులు అదే సమయంలో కంప్యూటర్ వాడుతూవుంటే ఎలెక్ట్రానిక్ రూపంలో సత్వర సందేశాలు ఇచ్చి పుచ్చుకోవడం. ఇంటర్నెట్ ఖర్చు తప్ప ఏ ఇతర ఖర్చులు లేకుండా పరిమితి లేకుండా వాడుకోవచ్చు. వీటిని గురించి వివరంగా తెలుసుకుందాం.

## ఈ మెయిల్

ఈ-పుత్తరాలు మరియు ఛాట్ కు అంతర్జాల సంపర్కం కలిగివుండాలి. కంప్యూటర్ పై స్థాపించుకొనే మెయిల్ కక్షిదారు ఎవల్యూషన్ వాడవచ్చు. అయితే ఎక్కడనుండైనా వాడుకోగలగటం, బ్యాక్ అప్ కు కష్టపడాల్సిన పని లేకపోవడం వలన చాలామంది వెబ్ ఆధారిత మెయిల్ అనువర్తనాలు వాడుతున్నారు. వాటిలో తెలుగు ముఖాంతరంగా వుండేవాటిలో ముఖ్యమైనవి గూగుల్ మెయిల్ మరియు విండోస్ లైవ్ మెయిల్ (హాట్ మెయిల్)

## గూగుల్ మెయిల్

విహరిణిలో గూగుల్ మెయిల్ చిరునామా [1] ప్రవేశపెట్టి దాఖలుచేయగానే, గూగుల్ మెయిల్ తెలుగు వెబ్ పేజీ కనిపిస్తుంది. మీరు కొత్తగా వాడుతున్నట్లయితే ఒక ఖాతా సృష్టించండి అన్న బొత్తాము పై నొక్కండి. మీ వివరాలు

---

1గూగుల్ మెయిల్(http://tinyurl.com/7q3lh)

అనగా యూజర్ పేరు, పాస్వర్డ్ ఇతర వివరాలు ప్రవేశపెట్టి గూగుల్ షరతులు ఒప్పుకున్నట్లు చెక్ పెట్టెలో టిక్ పెట్టి దాఖలు పరిచినట్లయితే మీ ఖాతా సృష్టించబడుతుంది. ఒకవేళ అదే పేరుతో ఇంతకు ముందే ఖాతా ఎవరిదైనా వుంటే మీరు మార్చుకోటానికి సలహాలు ఇస్తుంది. ఆ తరువాత మీరు ఖాతా వివరాలు దాఖలుచేసి మీ ఖాతాలో ప్రవేశించవచ్చు.

అప్పుడు కనిపించే తెరలో మీకు వచ్చిన ఈ-ఉత్తరాలు కనబడతాయి వాటిని చదివి ప్రత్యుత్తరాలివ్వవచ్చు. కొత్త సందేశం సృష్టించాలంటే సందేశం సృష్టించు అన్న బొత్తాము నొక్కితే కనబడే తెరలో కి: అన్నచోట మీరు పంపదలచుకున్న వారి ఈ-మెయిల్ చిరునామా, విషయం (సబ్జెక్టు) వరుసలో సంక్షిప్తంగా వుత్తరం సమాచారం రాసి ఆ క్రింద వివరంగా సమాచారం రాసి దానిక్రింద వున్న పంపించు అన్న బొత్తాము నొక్కాలి అంతే మరి. గూగుల్ వాడటంవలన ఇంకా లాభమేంటంటే మీరూ రాసే వుత్తరము స్వయంచాలకంగా దాచబడుతుంది. మీకిష్టమైతే గూగుల్ లిప్యంతరీకరణ సాధానాలు వాడుకోవచ్చు. మరిన్ని వివరాలకు గూగుల్ లో సహాయంపేజీలు చూడండి.

# విండోస్ లైవ్ మెయిల్

విహారిణిలో విండోస్ లైవ్ మెయిల్ చిరునామా [2] అని ప్రవేశపెట్టి దాఖలుచేయగానే, హాట్ మెయిల్ తెలుగు వెబ్ పేజీ కనిపిస్తుంది. మీరు కొత్తగా వాడుతున్నట్లయితే సైన్ అప్ అన్న బొత్తాముపై నొక్కండి. మీ వివరాలు అనగా విండోస్ లైవ్ ఐడి ( Windows Live ID), పాస్వర్డ్ ఇతర వివరాలు ప్రవేశపెట్టి షరతులు ఒప్పుకున్నట్లు చెక్ పెట్టెలో టిక్ పెట్టి దాఖలు పరిచినట్లయితే మీ ఖాతా సృష్టించబడుతుంది. ఒకవేళ అదేపేరుతో ఇంతకు ముందే ఖాతా ఎవరిదైనా వుంటే మీరు మార్చుకోటానికి సలహాలు ఇస్తుంది. ఆ తరువాత మీరు ఖాతా వివరాలు దాఖలుచేసి మీ ఖాతాలో ప్రవేశించవచ్చు.

2 విండోస్ లైవ్ అనబడే హాట్ మెయిల్(http://tinyurl.com/8ibe)

అప్పుడు కనిపించే తెరలో మీకు వచ్చిన ఈ-ఉత్తరాలు కనబడతాయి వాటిని చదివి ప్రత్యుత్తరాలివ్వవచ్చు. కొత్త సందేశాలు పంపవచ్చు మీకిష్టమైతే మైక్రోసాఫ్ట్ లిప్యంతరీకరణ సాధానాలు వాడుకోవచ్చు. మరిన్ని వివరాలకు మైక్రోసాఫ్ట్ సహాయంపేజీలు చూడండి.

# చాట్

ఛాట్‌లో వ్యక్తిగత ఖాతాలు ప్రసార ఖాతాలు అని రెండురకాలు. మీరు ఒక సమూహంలో చేరి పంపే సందేశాలు వ్యక్తిగత ఖాతాల క్రిందికి, మీరు ఎవరికి ప్రత్యేకించి వుద్దేశించకుండా పంపే సందేశాలు ప్రసారఖాతాలు క్రిందికి వస్తాయి. ఫ్రీనోడ్ (freenode) సైట్‌లో ఇంటర్నెట్ రిలే ఛాట్ (irc) వ్యక్తిగత ఖాతాకి ఉదాహరణ, ట్విట్టర్ ప్రసార ఖాతాకి ఉదాహరణ.




*బొమ్మ19: ఛాట్‌మెనూ*

# ఫ్రీనోడ్ ఐఆర్సి

మీ తెరపైపేనెల్‌లో కుడివైపు కవరు ప్రతిమపై నొక్కి ఛాట్ మెనూ నొక్కితే మీరు ఖాతాలను జతపరచుకోవచ్చు. మీరు ఫ్రీనోడ్‌ను ఎంచుకుంటే మీ నిక్‌నేమ్ ప్రవేశపెట్టాలి. ఆ తరవాత నిక్‌సర్వర్‌లో /join #ubuntu-in నొక్కితే మీరు భారత దేశపు ఉబుంటు ఔత్సాహికులు ఛాటింగ్ విభాగంలో చేరతారు. దానిలోనున్న వారు పంపే సందేశాలు

మీరు చూడవచ్చు. మీరు సందేశాలు పంపవచ్చు.




*బొమ్మ 20: సందేశ ఖాతాలు జతపరచు*

# ట్విట్టర్




*బొమ్మ 21: ఛాట్ స్థితి మరియు ఖాతాల వివరాలు*




*బొమ్మ 22: ప్రసార ఖాతాలు జతపరచు*

మీ తెరపై పేనెల్ లో కుడివైపు కవరు ప్రతిమపై నొక్కి ఛాట్ మెనూ నొక్కితే మీరు ఖాతాలను జతపరచుకోవచ్చు. మీరు ట్విట్టర్ ను ఎంచుకుంటే మీ వాడుకరిపేరు సంకేతపదం ప్రవేశపెట్టాలి. ఆ తరవాత ట్విట్టర్ విండో కనబడుతుంది.

# చలనచిత్రాలు




*బొమ్మ23: చలనచిత్రప్లేయర్(టోటెమ్)*

ఉబుంటు తో అప్రమేయంగా సినిమాలను చూపించేది చలనచిత్రప్లేయర్ (టోటెమ్). దీనిలో నేరుగా స్వేచ్ఛా సాంకేతికాల ఆకృతిలో వున్న సినిమాలు చూడవచ్చు. ఎమ్పెగ్(mpeg) లాంటి సాంకేతికాల ఆకృతిలో వున్న విసిడి/డివిడి మాధ్యమాలకోసం జిస్ట్రీమర్ (gstreamer)విస్తరణ స్థాపించుకోవాలి. దీనిని ఉబుంటు స్థాపించుకునేటప్పుడు థర్డ్ పార్టీ ప్లగిన్లు స్థాపించు అన్న చెక్ బటన్ చేతనంచేస్తే సరే లేకపోతే మీకు ఇటువంటి మాధ్యమం వాడటం మొదలుపెట్టినపుడు, ప్లగిన్లు స్థాపించమనే విండో ప్రత్యక్షమవుతుంది. అప్పుడు అంతర్జాల సంపర్కంతో స్థాపించుకోవచ్చు.

# ఫైళ్లు

మీ కంప్యూటర్లోని చలనచిత్రఫైళ్లు చూడటానికి, వాటిపై రెండు సార్లు నొక్కితే అప్రమేయ అనువర్తనంతో నడపబడుతుంది. వేరే అనువర్తనం వాడాలనుకుంటే మౌస్ కుడి మీట నొక్కి తెరచు ఎంచుకొని అప్పుడు కనబడే విండోలో మీకు నచ్చిన అనువర్తనం ఎంపిక చేసుకోవచ్చు.

# డివిడి(DVD)

సినిమా డివిడి మీరు ప్రవేశపెట్టగానే మీకు ఉపకరణాన్ని ఎంచుకొనే విండో కనబడుతుంది. సరే నొక్కిన తరువాత మీ డివిడి నడపబడుతుంది.




*బొమ్మ24: పాప్ అప్ విండో డివిడి పెట్టినపుడు*

# విసిడి(VCD)

విసిడి కూడా డివిడి లాగానే పనిచేస్తుంది. అయితే చలనచిత్రప్లేయర్ లోని దోషాల కారణంగా స్వయంచాలకంగా సరిగా పనిచేయడంలేదు. అందుకని విఎల్సి మీడియా ప్లేయర్(VLC media player) స్థాపించుకుని దానిలో మెనూలో open disk అదేశం ఇచ్చి ఆ తరువాత వచ్చు సంవాదపెట్టెలో vcd ఎంచుకుంటే సరి.

# సంగీతం

మీ దగ్గరున్నఫైళ్లులేక సిడి(CD) లేక అంతర్జాల రేడియో స్టేషన్ల నుండి ఉబుంటు లో సంగీతం వినటానికి వాడే అనువర్తనం బన్షీ మ్యూజిక్ప్లేయర్. దీనితో పాటుగా చలనచిత్రప్లేయర్ తో కూడా శబ్దఫైళ్లు వినవచ్చు.

## స్వేచ్ఛా సాంకేతిక ఆకృతిగల ఫైళ్లు

ఇది నేరుగా స్వేచ్ఛామూలాలు పేటెంట్ హక్కులు లేని ఆకృతిలో వుండే సంగీతాన్ని (.ogg format) వినవచ్చు. కొన్ని వుదాహరణ సంగీత ఫైళ్లు మీ నివాసం లో ఉదాహరణలు అనే సంచయంలో వున్నాయి.

## సాధారణ ఆడియో సీడి

సాధారణ ఆడియో సీడి లో ధ్వని సాధారణ కోడింగ్ లో వుంటుంది. ఇటువంటి సీడి పెట్టగానే ఇది ఆడియో డిస్క్ గా గుర్తించబడుతుంది. బన్షీలో ఆడియోసిడి ఎంచుకొని పాటలు వినవచ్చు.




*బొమ్మ25: బన్షీ మ్యూజిక్ప్లేయర్ సాధారణ ఆడియో సిడి నడుపుతూ*

# ఎమ్పి3(mp3) ఆడియో సిడి

సిడీలలో ఎమ్పి3 (mp3) ఫైళ్లు వుంటే వాటిని వినడానికి మీరు జిస్ట్రీమర్( gstreamer)విస్తరణ స్థాపించుకోవాలి. దీనిని మీరు ఉబుంటు స్థాపించుకునేటప్పుడు థర్డ్ పార్టీ ప్లగిన్లు స్థాపించు అన్న చెక్ బటన్ చేతనంచేస్తే సరి లేకపోతే మీకు ఇటువంటి మాధ్యమం వాడటం మొదలుపెట్టినపుడు, ప్లగిన్లు స్థాపించమనే విండో ప్రత్యక్షమవుతుంది. అప్పుడు అంతర్జాల సంపర్కంతో స్థాపించుకోవచ్చు. ఇవి ఒకసారి స్థాపించుకుంటే చలనచిత్ర ప్లేయర్, ఫైర్ ఫాక్స్ లాంటి ఇతర అనువర్తనాలు కూడా వాడుకుంటాయి




*బొమ్మ 26: బన్షీ మ్యూజిక్ ప్లేయర్ mp3 ఆడియో సిడి నడుపుతూ*

CD నుండి మీడియాను దిగుమతి చేసి (మెనూలో మీడియా-> మీడియాను దిగుమతి చేయి) పాటల జాబితా తయారు చేసుకుంటే ఒక దాని తర్వాత ఒకటి నడుపుతుంది.

# ఫోటోలు

ఫోటోలు కంప్యూటర్లో ప్రవేశపెట్టటానికి మీ డిజిటల్ కెమేరా కాని అనుసంధానించిన స్కానర్ వాడి చేయవచ్చు. ఉబుంటులో ఫోటోలని చక్కదిద్దటానికి షాట్వెల్ ఫోటో నిర్వాహకి వాడుతారు. మరిన్ని సౌలభ్యాలకి గింప్ (GIMP) వాడవచ్చు.




*బొమ్మ 27: షాట్వెల్ అనువర్తనంలో ఫోటో చక్కదిద్దటం*

## కెమేరా

మీరు కెమేరా అనుసంధానించినపుడు, అనువర్తనం ఎంపికకోసం పాప్ అప్ విండో కనబడుతుంది. ఆ తరువాత మీ కెమేరాలోని ఫోటోలు వీడియోలు చూపెడుతుంది. వాటిని ఎంపిక చేసుకొని మీ కంప్యూటర్ సంచయంలో పెట్టుకోవచ్చు. ఆ తరువాత వాటిని చక్కదిద్దటం (ఉదా: రెడ్ ఐ సరిదిద్దు, పరిమాణం మార్చు లాంటివి)




*బొమ్మ 28: పాప్ అప్ డిజిటల్ కెమేరా*

చేయవచ్చు.

# స్కానర్

ఉబుంటులో సింపుల్ స్కాన్ అనే అనువర్తనంతో మీ దగ్గరవున్న స్కానర్ నుండి భౌతిక ఫొటో లేక పత్రాన్ని డిజిటల్ రూపంలో మార్చుకోవచ్చు.




*బొమ్మ 29: సింపుల్ స్కాన్ తెరపట్టు*

# ముద్రణ




*బొమ్మ30: ముద్రించు తెరపట్టు*

మీ ముద్రణాయంత్రమును కంప్యూటర్ కు అనుసంధానించినపుడు, స్వయంచాలకంగా అది కనుగొనబడి చోదకి చేర్పు విండో కనబడును. లేనిచో మీరు వ్యవస్థ అమరికలు(System Settings) లో ముద్రణ ఎంచుకుని ఆ తరువాత జతచేయు(Add) నొక్కి మీ ముద్రణా యంత్ర చోదకిని అమర్చుకోవచ్చును. ఒకవేళ మీ దగ్గర ముద్రణాయంత్రము లేనిచో పిడిఎఫ్(pdf) ముద్రణా చోదకిని అమర్చుకొని దాని సహాయంతో pdf ఫైల్ తయారు చేసి సమీపంలోని ముద్రణాయంత్రముకలిగిన వ్యవస్థలో ముద్రించుకోవచ్చును. తెలుగు ముద్రించునపుడు ఖతులు pdf ఫైల్ లో ఇముడ్చుకుంటే (PDF/A-1A)మీరు వాడిన ఖతులే ఇంకే వ్యవస్థపైన తెరచిన వాడబడుతాయి.

# సాధారణ ఉత్తరాలు, లావాదేవీ పత్రాలు, నివేదికలు



బొమ్మ31: లిబ్రెఆఫీస్ రైటర్

మీరు ప్రభుత్వాధికారికో, పత్రికా సంపాదకునికో ఉత్తరం లేక అద్దె ఒప్పందం పత్రము లేక మీ పరిశోధన నివేదిక తయారుచేయాలనుకుంటే మీకు వుపయోగపడేది లిబ్రెఆఫీస్ రైటర్. ఇది ఓపెన్ఆఫీస్ నుండి వేరుపడి డాక్యుమెంట్ ఫౌండేషన్ వారిచే అభివృద్ధిచేయబడుతున్న కార్యాలయపు సూట్ లో పత్రాలు తయారు చేయుటంకోసం అనువైనది. ఇది మైక్రోసాఫ్ట్ ఆఫీస్ లోని వర్డ్ తో దీటైన లక్షణాలు గల సాఫ్ట్వేర్. విండోస్ వర్డ్ ఆకృతి గల ఫైళ్లు దీనితో తెరవవచ్చు, ప్రామాణికమైన ఓపెన్ డాక్యుమెంట్ తీరు లో రాయవచ్చు లేక మైక్రోసాఫ్ట్ యొక్క కొత్త డాక్యుమెంట్ ఫార్మాట్ లోనైనా రాయవచ్చు. ఇది వుపయోగించి ఒక చిన్న వుత్తరము ఎలా చేయాలో మనం పరిశీలిద్దాం.

# ఉత్తరం తయారీ




*బొమ్మ32: ఉదాహరణ ఉత్తరము*

లిబ్రెఆఫీస్ రైటర్ పై నొక్కి అనువర్తనం ప్రారంభించండి. మీకు ఒక ఖాళీ పత్రం కనబడుతుంది. దానిలో ఈ క్రింద ఇవ్వబడిన వివరం టైప్ చేయండి

తరవాత పై సమాచారాన్ని అకృతీకరించటానికి మెనూ నుండి లేక సాధనాల పట్టీనుండి అదేశాలు ఎంచుకోండి.

ఉదాహరణకు:తొలివరుసను ఎంచుకొని కుడివైపు అనుగుణం (ఆకృతీకరణ-అనుగుణం-కుడి) లేక కుడివైపు అనుగుణం చూపే ప్రతిమపై నొక్కితే అ పదం కుడివైపుకి జరపబడుతుంది.అలాగే మిగతా ఆకృతీకరణ పూర్తి చేయండి.

హైద్రాబాదు

తేది:12 ఏప్రిల్ 2011

నుండి:ప్రసాద్ రేవుల

ఇంటి నెంబరు 24, 12 వ అడ్డ రోడ్డు

పి&టి క్వార్టర్స్

చిక్కడపల్లి

హైద్రాబాదు 20

కి:ఎక్జెక్యూటివ్ ఇంజినీర్

విద్యుత్ సబ స్టేషన్

చిక్కడపల్లి

హైద్రాబాదు 20

అయ్యా,

మా కాలనీలో విద్యుత్ సరఫరా గత కొన్ని రోజుల నుండి సక్రమంగా లేదు. చాలా అంతరాయాలున్నాయి. విద్యార్థులకు, వృద్ధులకు దీనివలన ఇబ్బందులు ఏర్పడుతున్నాయి. వీలైనంత త్వరలో విద్యుత్ సరఫరా సక్రమం చేయవలసినదిగా కోరుచున్నాను.

భవదీయుడు

ప్రసాద్ రేవుల

# ఆర్థిక మరియు ఇతర లెక్కలు

ఆర్థిక మరియు ఇతర లెక్కలు చూసుకొనటానికి మరియు మన దత్తాంశాన్ని చిత్రాల రూపంలో మార్చుటకు సరియైన అనువర్తనం లిబ్రెఆఫీస్ కేల్క్. ఈ విభాగంలో దీనిని ఎలా వాడుకోవచ్చో పరిశీలిద్దాం.

## ఉదాహరణ




| | A | B | C | D |
|---|---|---|---|---|
| 1 | తెలుగు కళాజ్యోతి, చిక్కడపల్లి | | | |
| 2 | 2010-11 వార్షిక ఆదాయ వ్యయాల చిట్టా | | | |
| 3 | ఆదాయం | | వ్యయం | |
| 4 | వివరణ | మొత్తం | వివరణ | మొత్తం |
| 5 | సభ్యత్వ రుసుం | 30000 | ప్రకటన ఖర్చులు | 10000 |
| 6 | అంతర్జాల తెలుగు సంస్థ విరాళం | 70000 | కళాకారుల ఫీజు | 75000 |
| 7 | బ్యాంకు వడ్డీ | 5053 | వేదిక ఫీజు | 20000 |
| 8 | | | మిగులు | 53 |
| 9 | | 105053 | | 105053 |



*బొమ్మ 33: లిబ్రెఆఫీస్ కేల్క్ ఉదాహరణ తెరపట్టు*

తెలుగు కళాజ్యోతి, చిక్కడపల్లి సంస్థ 2010-11 వార్షిక ఆదాయ వ్యయాల చిట్టా వివరాలు ఇలా వున్నాయి.

ఆదాయం

| వివరణ | మొత్తం |
| --- | --- |
| సభ్యత్వ రుసుం | 30000 |
| ఆంతర్జాల తెలుగు సంస్థ విరాళం | 70000 |
| బ్యాంకు వడ్డీ | 5053 |

వ్యయం

| వివరణ | మొత్తం |
| --- | --- |
| ప్రకటన ఖర్చులు | 10000 |
| కళాకారుల ఫీజు | 75000 |
| వేదిక ఫీజు | 20000 |

ఈ వివరాన్ని కేల్క్ లో ప్రక్కన బొమ్మలో చూపినట్లుగా ప్రవేశపెట్టండి. మొత్తం కనుక్కోటానికి B9 లో =SUM(B5:B7) అనే సూత్రాన్ని ప్రవేశపెట్టండి. మిగులు కనుక్కోటానికి D8 లో సూత్రం =D9-SUM(D5:D7) వాడండి. ఆ తరువాత అదాయం పట్టిక లోని దత్తాంశాన్ని ఎంచుకొని చిత్రం తయారు చేయండి.

# ప్రజంటేషన్లు



బొమ్మ34: ప్రజంటేషన్ విజర్డ్ అంకం1

లిబ్రెఆఫీస్ ఇంప్రెస్ తో చక్కనైన ప్రజంటేషన్లు తయారుచేయవచ్చు. సులభంగా చేయటానికి ప్రజంటేషన్ విజర్డు



బొమ్మ35: ఖాళీప్రజంటేషన్ మాదిరి

వుంది. దీనిలో ఖాళీ ప్రజంటేషన్ ఎంచుకుంటే సాధారణ మాదిరితో తరువాత మీరు సమాచారం చేర్చుటకు వీలుగా స్లైడ్ తయారవుతుంది.

# ఉదాహరణ

మన ఇంతకు ముందు కేల్క్ లో వాడిన ఉదాహరణ పొడిగించుదాం. దానిలో వున్న సమాచారాన్నిప్రసాద్ రేవుల కోశాధికారిగా ప్రజంటేషన్ తయారుచేసాడు. అప్పుడు ఎలా వుంటుందో బొమ్మలలో చూడండి. మీరు ప్రయత్నించండి.

తెలుగు కళాజ్యోతి 2010-11వార్షిక నివేదిక

ప్రసాద్ రేవుల
కోశాధికారి
ఈమెయిల్:prasadrevula@xyzmail.com

*బొమ్మ36: ప్రజంటేషన్ ఉదాహరణ1 వస్లైడ్*

2010-11 అదాయ వ్యయ చిట్టా

| *2010-11 వార్షిక ఆదాయ వ్యయాల చిట్టా* | | | |
|---|---|---|---|
| **ఆదాయం** | | **వ్యయం** | |
| **వివరణ** | **మొత్తం** | **వివరణ** | **మొత్తం** |
| సభ్యత్వ రుసుం | 30000 | ప్రకటన ఖర్చులు | 10000 |
| ఆంతర్జాల తెలుగు సంస్థ విరాళం | 70000 | కళాకారుల ఫీజు | 75000 |
| బ్యాంకు వడ్డీ | 5053 | వేదిక ఫీజు | 20000 |
| | | మిగులు | 53 |
| | **105053** | | **105053** |

*బొమ్మ37: ప్రజంటేషన్ ఉదాహరణ2 వస్లైడ్*

అదాయంచిత్రరూపం




*బొమ్మ38: ప్రజంటేషన్ ఉదాహరణ3 వస్లైడ్*

# ఆటలు




*బొమ్మ39: సుడోకో ఆట*

ఉబుంటుతో చాలా ఆటలు అందుబాటులోనున్నాయి. అప్రమేయంగా కొన్ని స్థాపించబడతాయి. వాటిలో సుడోకో ఒకటి. మిగతావి అవసరమైనపుడు స్థాపించుకోవచ్చు. అనువర్తనాలు వెతుకు అదేశం ఇచ్చిన తరువాత ఆటలు ఎంచుకొని స్థాపించబడనవి స్థాపించుకోవచ్చు. లేక ఉబుంటు సాఫ్ట్వేర్ కేంద్రము తెరచి మనకు కావలసిన వాటిని స్థాపించుకోవచ్చు.

# తరచూ అడిగే ప్రశ్నలు

**1. నాకు తెలుగు అనువాదం లో తప్పులు కనబడ్డాయి. వాటిని సరిచేయటం ఎలా?**

తెలుగు అనువాదాన్ని మెరుగు పరచడానికి తెలుగు స్థానికీకరణ జట్టు [1] పనిచేస్తున్నది. మీరు అ పేజీలలో సరియైన పాకేజీని ఎంపికచేసికొని కొత్త అనువాద పదాన్ని చేర్చవచ్చు. తెలుగు స్థానికీకరణజట్టులో పాల్గొని మరింత చర్చించవచ్చు.

**2. తెలుగు టైపు చేయటానికి కీ బోర్డుపై తెలుగు అక్షరాలు ముద్రించి వుంటే బాగుంటుంది. దానికేదైనా సూచన చేయగలరా?**

తెలుగు అక్షరాలు ముద్రించిన కీ బోర్డులు అందుబాటులో లేవు. కాని దీనికోసం చిన్న చిట్కాలున్నాయి. అక్షరాలు గమ్ అతికించిన పేపర్ లేక ఫిల్మ్‌పై ముద్రించుకొని మీ కీ బోర్డుపై అంటించుకోవచ్చు. లేక చెరిగిపోని సిరా గల కలం తీసుకొని మీరే చక్కగా కీ బోర్డుపై తెలుగు అక్షరాలు రాసుకోవచ్చు.

**3. పుస్తకం చదివితే ఆసక్తిగా వుంది. కాని ఎవరైనా ఒక వర్క్‌షాప్ లో నేర్పించితే మాకు వుపయోగంగా వుంటుంది?**

మీరు తెలుగులినక్స్ వాడుకరుల జట్టు ని[2] మీ అభ్యర్ధన తెలియచేయండి. వారు స్పందిస్తారు. ప్రభుత్వ కార్యాలయాలలో మీరు పనిచేస్తుంటే బాస్‌లినక్స్ సహాయ కేంద్రాన్ని [3]సంప్రదించవచ్చు.

---

1ఉబుంటు తెలుగు స్థానికీకరణ జట్టు (http://tinyurl.com/3vxyhzk)

2తెలుగు లినక్స్ వాడుకరుల జట్టు(http://tinyurl.com/4yr7tca)

3బాస్ లినక్స్ సహాయ కేంద్రం(http://tinyurl.com/3uo5uge)

# కంప్యూటర్ పదకోశం

| తెలుగు | English | తెలుగు అర్థం |
|---|---|---|
| రంగస్థలం | Desktop | కంప్యూటర్ లో రోజు వారి పనికోసం వాడే ఫైళ్లు, అనువర్తనాలు లింకులు వుండే సంచయం |
| సంచయం | Folder/Directory | ఫైళ్లు కలిగినది. దీనిలో ఇతర సంచయాలుకూడా వుండవచ్చు. |
| అప్రమేయ | Default | ఎంపిక లేకుండా జరుగునది. |
| లాంచర్ | Launcher | అనువర్తనాల ప్రతిమలు కలిగిన స్థలం.దీనిలోని ప్రతిమలపై నొక్కుటద్వారా సులభంగా అనువర్తనాలు ప్రారంభించవచ్చు |
| డాక్ | dock | తరచుగా వాడే వాటిని లాంచర్ లో పెట్టుట |

*పట్టిక2: పదకోశం*



# వికీపీడియా

## స్వేచ్ఛా విజ్ఞాన సర్వస్వము

**కంప్యూటర్ ని తెలుగులో వాడి, నీ జ్ఞానాన్ని పెంచుకో, అందరితో పంచుకో, జ్ఞానసమాజాన్ని నిర్మించటంలో చెరగని ముద్రలు వేయి!**

**http://te.wikipedia.org**

ubuntu

# ఉబుంటు

# వాడుకరి మార్గదర్శని

*తెలుగులో ప్రారంభం నుండి ముగింపు దాక*




*వెబ్ లో విహరించండి, ఛాట్ ద్వారా సంభాషించండి, పత్రాలు సృష్టించండి,*

*చిత్రాలు సవరించండి మరియు*

*వేలకొలది ప్రోగ్రామ్ ల నుండి ఎంచుకోండి.*

*ఉబుంటు వేగవంతమైనది, సులువైనది అంతేకాదు ఉచితం*